वृत्तिना कालं निनाय। द्वितीयः रामकृष्णाख्यः अल्पीयस्यां वयसि संस्कृतांग्लभाषापांडित्य मंडितोऽपि अचिरेणैव कालेन लोकांतरमगमत्.

तृतीयः दुर्गानागेश्वरशास्त्री सहजाखण्डपाण्डितीधुरीणः सर्वशास्त्र-पारंगतः योगाभ्यासरतः पितुरनन्तरं बंदरु पट्टणे नोबिल कलाशालाया पंडितपदवीमधिष्ठाय शिष्यवर्गाणां शास्त्रपाठप्रवचने योगाभ्यासे च व्यापृतः ज्ञाननिष्ठ स्थित प्रज्ञः निर्विचारो भूत्वा अपुत्रकः सौख्येन कालं निनाय.

रामचंद्रकवे : द्वितीय पुत्रस्य रामकृष्णाख्यस्य द्वेपुत्रौ रामचंद्रशास्त्री, लक्ष्मीनारायणाख्यौ. एतावांग्लविद्यमभ्यस्य प्रभुत्वोदद्योग निष्ठा बभूवतुः.

अस्यकवेर्ज्येष्ठपुत्रस्य लक्ष्मीमनोहराख्यस्य पुत्रौ द्वौ. रामकृष्णाख्यः शेषावधानीति. द्वितीय : शेषावधानी यत् किंचिदांग्लविद्यां संपाद्य प्रभुत्वोद्योगव्यापृतोबभूव.

ज्येष्ठश्च रामकृष्णाख्यः, नोबिल् कलाशालायां आंग्लभाषामभ्यस्य दुर्गानागेश्वराख्य पितृव्यगुरुचरणसन्निधौ समभ्यस्तसंस्कृतांध्रविद्यासंपन्नः, बि. ए. पट्टभद्रोभूत्वाविजयनगराख्यपट्टणे महाराजस्य आंग्लकलाशालायां संस्कृतान्ध्राध्यापक पदव्यां द्वादशवर्षाणि अनयत्.

अनन्तरं मद्रपुर्यां विश्वविद्यालये आंध्रपरिशोधनशालायां मुख्योपन्यासकपदवीमधिष्ठाय अंध्रभाषासाहित्यपरिशोधनकार्यं यथामति साधयित्वा, तत्तद्विषयान् ग्रंथरूपेण व्यासरूपेण च प्रकटीकृतवान्.

क्रिस्ताब्दीय १९४९ संवत्सरे जूलैमासे तद्विश्वविद्यालयोपन्यासक स्थानात् विरराम.

अद्य च श्रीवेंकटेश्वरस्वामिनः अनुग्रहात् तिरुपति प्राच्यपरिशोधनालये आंध्रपरिशोधकस्थाने नियुक्तः आंध्रभाषासाहित्यपरिशोधनकार्यं निर्वाहयन्नास्ते. इत्थं अस्य षष्ठिसंवत्सराणि गतानि. पूर्वस्वर संवत्सर आश्वयुज प्रथमे दिने अस्यजन्म. (२—१०—१९९१)

तद्रचितग्रंथनामानि अन्यत्र द्रष्टव्यानि.

శ్రీ

కౌండిన్యమహాముని గోత్రమున నుద్భవించి పవిత్ర గోదావరీతీరమున నెలకొన్న కోరాడా న్వయమునకు మూలపురుషుడు

మహాదేవశాస్త్రి

---

కోరాడ ఇతిచసంతతి రభవ త్తస్యామభూన్మహాదేవః
ససర్వశాస్త్రప్రభవైకరూపక శ్రీదేవతాపాద సరోజబంభరః
స్వస్యాన్వయోత్పన్న జనుష్మతాంమనాగ్వమూాధతానోచితమి
త్యవేత్యసః॥

శ్రీశైలగోత్రే భ్రమరాంబికాంతే
మాలూరపత్రైర్ద్విరసైఃకృతాహృతిః
శర్వాక్షీ విజ్ఞేయమితేరనారతం
చక్రేద్భుతం తద్వ్రతమిత్థధైర్యకం ॥

ఈమహాదేవశాస్త్రి సర్వశాస్త్రపారంగతుడై తనవంశము నంతనుగూడనట్టి జ్ఞానసూర్యునిచేఁ ప్రకాశింపఁ జేయవలయుననియెంచి శ్రీశైలపర్వతమున భ్రమరాంబికా ప్రసాదమునకై ఎండుమారేడు దళము లుపహారముగ జేసికొని తపంబొనర్ప నిరువదియేడు దినంబులు గడచినతోడనే వానినియమంబున కాయంబ సంతసించినదై నీవాంఛితముం దెల్పుమనిన.

శ్లో॥ సర్వం హ్యదృష్టస్య వశంహి కామం। విద్యాస్తిచేత్సర్వవిపన్నివృత్తిః। తయాప్యతేసర్వజనేషు మాన్యతా। యయేయతేసౌఖ్యమజస్రగమ్యం॥

శ్లో॥ యాచేభగీరథరధాను గజహ్నుకన్యా
ప్రోద్యజ్ఝరీసహచరీ భవన ప్రకాండాం।
విద్యాంవిధేహి దయయామృతసారవత్యాం
హ్యసప్తమాన్మమ కులోద్భవ పూరుషాణాం ॥

విద్యగలిగిన నన్ని సంపదలును, మాన్యతయు తమంతట తామే వచ్చునుగాన దనవంశ మేడుపురుషాంతరముల వఱకు పండితులకాలవాలమై నెగడవలయుననికోర నాపెయు వల్లెయని యట్టివరంబొసంగెనట. అప్పటినుండియు నీవంశము పండితశిఖామణుల కాకరంబై వెలయుచుండ నీమహాదేవశాస్త్రి వెనుక అల్లాడ శాస్త్రియను నాయన సకలకలాపారంగతుండయ్యుఁ బరులకుఁ జెయ్యిజాచుట కిష్టము లేకదారిద్ర్యపీడితుండై యెట్టులో దినములుగడుపుచుండె. అంతనీయన షష్టిపూర్తి జేసికొన నిచ్ఛగలవాఁడౌట నాగ్రామజనులు కనిపెట్టి యాయనచేనొక శతఘంటావధానముచేయించిరట. ఈసమయమున నేయాయన "శతఘంటిక చూడామణి" యనిబిరుదు వడసెనట. మఱియు భూపరిగ్రహణంబునకైన నీయనొల్లకుండిన నచ్చటివారీయనను బలవంతపెట్టి, కన్యను విద్యను భూమిని పరిగ్రహించిన నేదోషము లేదనియు, దీనివలన నాయనయొక్క అపరిగ్రహత్వమునకు భంగమువాటిల్లదనియుఁ జెప్పి యాయనకొకపుట్టెడు భూమినిచ్చిరట. ఈయల్లాడశాస్త్రి చెప్పిన యీశ్లోకమొకటి తనమాతామహునివలన వింటినని యీరామచంద్రకవి చెప్పియున్నాడు.

శ్లో ॥ కమలసమశయానః పాద్విరాడాశయాన
స్వ్వభరణవశయానః ప్రోఝ్ఝితోసంశయానః
వరమధకశయానః క్షుత్రపాశాశయానో
వ్యధిజలధి శయానః పాతుపక్షీశయానః ॥

ఈఅల్లాడశాస్త్రి కుమారుడు జగన్నాథశాస్త్రి అనునాయన "నిజాంతర్వాణిత్వ ప్రథమవిధుతాశేషవిభవా విరాజంతే కీర్తిస్థగిత సకలాశాంతవివరాః" ఇట్లు దిగంతవ్యాప్తనుగు కీర్తిగలవాడుగాఁ జెప్పఁబడియున్నాడు. ఈజగన్నాథశాస్త్రికిద్దరుకుమారులు. అందుపెద్దవాఁడు సూరిశాస్త్రిఅనునాయన వారణాసికిఁబోయి గౌతమతర్కమున నఖండపాండిత్యము సంపాదించెను. ఈయనకు సంతతిలేదు. రెండవవాఁడగు సంబాదాసునకు సూరిశాస్త్రి లక్ష్మణశాస్త్రియను నిద్దరు కుమా-



రులు. అందు సూరిశాస్త్రి వేదాధ్యయనంబొనర్చి శాస్త్రాధ్యయనంబునకై యభిలషించుచుండఁ దండ్రిగతించుటయు దేశముక్షామపీడితంబగుటయు సంభవించె. అంతవీరితల్లి బిడ్డలనిద్దరఁదోడ్కొని గతిలేని వారికి రాజేగతియనితలంచి కాటిరేవు కోనరాజు నొద్దకుం బోవుచుండ దోవలో దొంగ లడ్డమువచ్చి తల్లిని పెద్దకుమారుని నిహతులజేసిరి. అంత రెండవవాడగులక్ష్మణశాస్త్రి యాయూరువదలి దేశాంతరమున నానాపట్టణముల దిరుగుచు నెచ్చటనో యొక యోగీంద్రునివలన శ్రీరామ తారక మంత్రముపదేశము పొంది కొంతకాలమునకు స్వదేశమునకువచ్చి వివాహముఁజేసికొని యత్తవారింటనే యుండెనట. ఈయన కుమారులు ముగ్గురు, అందు పెద్దవాఁడు రామచంద్రకవి, రెండవవాడు కృష్ణశాస్త్రి. మూడవవాఁడు సుబ్బరాయుఁడు. రెండవ వాఁడగు కృష్ణశాస్త్రి బాల్యమున చదువునందాసక్తిలేక తిరుగుచు నొకనాఁడన్నగారిచేఁ జెంపపెట్టుఁదిని మిగుల రోషముతో నిల్లువెడలి యచ్చటచ్చటఁ దిరుగుచుఁ దుదకు వారణాసిఁజేరి శాస్త్రాధ్యయనము మొదలుపెట్టెను. అంతనొక సంవత్సరమునకే వ్యాకరణశాస్త్రమున పరిపూర్ణపాండిత్యము గలిగి శాస్త్రచర్చలుఁ జేయుచుండెనని యింటి కుత్తరములు వచ్చినవట. మఱియొకవత్సరము గడచునప్పటికి న్యాయ శాస్త్రము మొదలుగాగల వానియందు గూడ స్వాతంత్ర్యము సంపాదించి యచటి పండితులనెల్ల నాకాశీమహారాజు నెదుట సభలో నోడించెనట. ఇట్టి ప్రఖ్యాతిని నామేధావిశేషంబు నుత్తరముల వలన వినియిచట నాతనియన్న మొదలగువారు మహానందమునుజెంది వివాహ ప్రయత్నములు జేయుచుండిరట. కాని మఱికొంతకాలము గడచునప్పటికి మహారాజాహోల్కారు తమయాస్థానపండితునిగాగై కొనితీసికొనివెళ్లెననియు నచ్చటికిఁబోయిన కొద్దికాలముననే హఠాన్మరణము సంభవించెననియు వినవచ్చె. అంత నీరామచంద్రకవికింగల్గిన సంతాపమింతంతని చెప్పనలవిగాదు అప్పుడు దుఃఖముచే మైమరచి వీధులఁబడి దొర్లనారంభించెనని అప్పుడు చూచినవారు చెప్పుదురు.

శ్రీరామచంద్రకవి జన్మించినది వెనుకటి యువసంవత్సర ఆశ్వయుజ శుద్ధదశమి. గోదావరిజిల్లా అమలాపురం తాలూకా కేశనకుఱ్ఱు గ్రామములో బాల్యమున మాతామహులయింటనే పుట్టి పెరిగి యచ్చట పండ్రెండవయేటనే తనతండ్రియొద్ద శ్రీరామమంత్ర ముపదేశముబొంది మిగులనాసక్తితో జపించుచుండెను అచటనే మాతామహునియొద్ద రఘువంశము మొదలిడితరువాత సమీపమందున్న పిత్రీయగ్రామమైన నడవపల్లివచ్చి సోమయాజుల సూరన్న గారివద్ద విద్య నభ్యసించుచు నప్పుడప్పుడు శ్రీశిష్టు కృష్ణమూర్తి శాస్త్రి గారివద్ద నలంకార గ్రంథములు చదువుచు కవనమలవాటుచేసికొన్నట్లుగా వినవచ్చెడిని. ఈ సూరన్న శాస్త్రిగారియొద్ద కావ్యపాఠముం జదువుచుఁ బాలమునకుం బోయి తిరిగి యింటికి వచ్చునంతలోఁ గొన్ని శ్లోకములనల్లి గురువుగారిని దిద్దుమని చూప నాయన ఆశ్చర్యపడి, యాశ్లోకముల దిద్దుటకుఁ దాను తగియుండననియుఁ పెద్దలయొద్దకుం బోయిన నీకవితకుందగు ప్రోత్సాహము గలుగుననియుఁ జెప్పుచుండెడివారట. ఈ ప్రోత్సాహము శ్రీమహాకవి కృష్ణమూర్తి శాస్త్రిగారి వలన గలిగియుండెను. ఏలయన గంగాప్రవాహముంబోలు నీమహాకవి కవితాధారయే ఈ రామచంద్రకవి కవితాప్రవాహిని కుద్బోధ కారణమై యుండుననుటకు సంశయములేదు.

"శ్రీశిష్టవంశాబ్ధి శిశిరకరుడు సకల విద్యాజన్మ సద్మాయమాన జిహ్వాంచలుడమిత కావ్యాళికర్త। యయిన శ్రీకృష్ణమూర్తి పదాబ్జసేవా। నాత్త సద్గ్రంథ కల్పనావిత్తసుమతి। విరచిత శ్రవ్యదృశ్యాత్మ వివిధకావ్యుడు।" అని మంజరీ మధుకరీయమను నాటికలో నీకవి చెప్పుకొని యున్నాడు. ఇట్లు కొంతకాలమైనతరువాత నాయన స్నేహితులు కొందఱీయనను వివాహ ప్రయత్నము చేయుటలేదేమి యనియు,

శ్లో॥ త్వంసాహిత్యపరోఽసిసాధుకవితాధుర్యోఽసితేవాగ్మితా
సిద్ధాప్రవ్రజచెన్నపట్టణపురీం విద్యాలయేహూణకాః
అథ్యాస్యార్థ్వతమాయవిత్తబహులం దత్వాపరార్థంవరం
తేనస్యాత్తవసత్కళత్రవిభవ స్తస్మాదిహైతత్కురు॥



నీతండ్రి దరిద్రుఁడు గావున నీపాండిత్యముచే చెన్నపుర్యాదులకుఁ బోయి ధనము సంపాదించి వివాహమాడుమని సలహా యిచ్చిరట. ఇట్టి స్నేహితుల ప్రోద్బలంబున సంపాదనకై బయలుదేర నుద్యుక్తుండై యుండుసమయమున బ్రహ్మశ్రీ శిష్టు కృష్ణమూర్తి గారీయన కవిత్వమం దత్యాదరముకలవాఁడు గాన నీయన యుద్దేశమును వినినతోడనే తనకుఁ జిరపరిచితులగు రాజుల యాస్థానంబునఁ బ్రవేశమునకై యొక లేఖను వ్రాసి దీనివలన నీకార్యముసఫలమగునని చెప్పి పంపెనట. అంతట నీయుత్తరము దీసికొని బయలుదేరిపోఁగా దేశమున గాలివానలుపట్టి క్షామముసంభవించెననియుఁ గావున నారాజీయనను రెండుమాసములు తన యాస్థానమందుండిన నటుపైనిఁ జూచెదనని యుఁ జెప్ప, నచట నిలువనొల్లక చెన్నపట్టణమున పండిత మునసబీసంపాదింప వలయునను తలంపుతో బయలుదేరి దారిలో బందరు (మచిలీ) పట్టణముం జేరెను. ఇచ్చటికిఁ జేరునప్పటికి తెచ్చిన సొమ్మువ్యయమయి వెనుకటిదినము భోజనము లేకుండుటచేఁ మిక్కిలి డస్సినను, ఊరు క్రొత్తదగుటచేతను, ఆత్మగౌరవము స్వాతంత్ర్య మెక్కువ పాలుపడుటంజేసి సహజంబుగ యాచనా విముఖుండగుటవలన నేమియుందోచక గొడుగుపేట మల్లేశ్వరస్వామి యాలయముంజేరి కొంత విశ్రమించి సాయంకాలమగునప్పటికి నీశ్వరస్తుతి రూపంబులగు కొన్ని శ్లోకంబులఁ జదువుచుఁ గూరుచుండెనట. అప్పుడా దారినిఁ బోవుచుండిన ప్రభల అన్నప్పశాస్త్రిగారీయనవాగ్జాలమును విని యాశ్చర్యపడి యాలయములోనికిఁ బోయి మీరెవ్వరని ప్రశ్నింపఁ నెవ్వరైన నేమికార్యమనియెనట. ఈయన బలవంతపెట్టి యడుగగాఁ దన చెన్నపట్టణము బోవనిచ్ఛయుఁ దెచ్చిన సొమ్ము వ్యయమగుటయు నందున నీశ్వరసాన్నిధ్యముం జేరుటయుఁ దెల్పెనట. అప్పుడా శాస్త్రిగారీయన కవిత్వధారకును స్వతంత్రబుద్ధికి నాశ్చర్యపడి వాత్సల్యముదోప గద్దించుచు నెచ్చటనో యొకపూటభోజనమునకై యెవరినయిన యాశ్రయింపలేనివాఁడవు పట్టణముపోయి మునసబీ సంపాదింపగలవా లెమ్ములెమ్మని యనుచు దనగృహంబునకుం దోడ్కొని

పోయి భార్యను బిలిచి యీతనిఁ బుత్రవాత్సల్యముతోఁ జూడవల
యునని చెప్పి యొప్పగించెనట. ఇక్కడ కొంతకాలముండి ఇగువ
రామస్వామి శాస్త్రులవారియొద్ద గొన్ని మంత్రశాస్త్ర గ్రంథములఁ
జదువ మొదలుపెట్టి వీరందరి ప్రోద్బలముచే చెన్నపట్టణ ప్రయా
ణమునుండి విరమించెను. తరువాత వర్తెం అద్వైతపర బ్రహ్మశాస్త్రి
గారీయన వివాహము నిమిత్తమై నూరు రూప్యంబు లిచ్చిరట.
ఈధనముతో నీయన వివాహమునకై స్వదేశమున కేగెను. దారిలో
నములాపురమున గొడవర్తి నాగేశ్వరావధానులుగారీయన ప్రఖ్యా
తిని విని కన్య నిచ్చెదనని చెప్పగాఁ దల్లిదండ్రుల యనుమతికై
స్వస్థలమగు నడవపల్లికి జనెను. ఈ కవి యిల్లుచేరిన వార్త గ్రామ
మున విసవచ్చినంతనే యాప్తులానందముఁ జెందిరి. కాని మఱి
కొందఱీతం డింతలో నింతవాడయ్యెనా యని యసూయాపరులై
యొకదినమున స్నానమునకుఁ బోవుచుండ నీయన కడ్డమువచ్చి నీవు
కవిత్వము చెప్పుదువట యవధానము చేయుదువా యని ప్రశ్నించి
రట. ఈయన వారి యాతురత కాశ్చర్యపడియు నట్లకానిండని
చెప్పి భోజనానంతరము కూర్చుందమనియెనట. కాని వారు దాని
కొల్లక నీవందుకు సమర్థుఁడవైతివేని యీనిలుచున్నట్లే చెప్పి కదలు
మని చెప్పగా లేఖకులఁ బిలుపింపుడనియెను. అప్పుడా యూరనున్న
వారందఱినిఁ బిలువ నరువదేడుగురు ఘంటము లాకులతోవచ్చి యాస
మీపముననున్న నడవపల్లి దేవాలయములో సమావేశమైరి. వెంటనే
యొక్కొక పాదము చొప్పున చెప్పుట మొదలుపెట్టి సూర్యాస్తమ
యమగు నప్పటికి 107 పద్యములముగించెను. అచటనొకరు దీనికాశ్చ
ర్యపడి యింకను చెప్పెదవాయని యడుగఁ "జెప్పెదను ఈతకులో తే
మిటియని" యన్నట్లచ్చటనుండినవారు చెప్పుదురు. ఈశతావధా
నముఁజూచి యాశ్చర్యముఁ జెందినవారిలో గొందఱుకలసి నలువది
రూప్యంబుల నాయనకొసఁగిరట. వివాహమైన తోడనే యీయన
దీనికై చేసిన ఋణము దీర్చుటకుగాను సంపాదనార్థమై గోలకొండ
సంస్థానమునకు వెళ్లవలయునని తలఁచి మరల బందరుచేరిరి.



ఇచటికి వచ్చినతోడనే పూర్వ పరిచితులును నోబిల్ పాఠశాల
యందు పండితులుగానున్న పసుమర్తి ఉమామహేశ్వరశాస్త్రి
గారా పాఠశాలాధ్యక్షులు మఱియొక పండితునికై వెదకుచుండిరి
గాన నీయన గోలకొండ ప్రయాణమెట్లయిన నాపి పాఠశాలయందుఁ
బ్రవేశపెట్టు ప్రయత్నముఁ జేయవలయునని అన్నప్ప శాస్త్రిగా
రితోఁ జెప్పిరి. వీరు నీయన స్వభావమును బాగుగ నెఱింగియుండిరి
గాన నీకు రాజులయాశ్రయము వడయు నేర్పును నొకరినియాచించి
ధనము సంపాదించుటకు వలయు శక్తియుదక్కున్న గావున నట్టిపో
కడల మానుమని చెప్పి బలవంతపెట్టి యాపి నోబిల్ దొరవారితో
నీయన విషయము చెప్ప నాపాఠశాలలో నేడురూప్యంబుల వేతనమిచ్చి
క్రమముగా వృద్ధిజేయుదునని చెప్పి యాదొరవారీయనను జేకొనిరట.
అది మొదలా పాఠశాలయందొక్క రీతిగా నలువది మూడేండ్లధికారుల
మన్ననవడయుచు నాత్మగౌరవస్వాతంత్ర్యముల నిల్పికొనుచు తుదకా
పాఠశాల కళాశాలగా మారుటయు నద్దానియందాంధ్రప్రధానోపా
ధ్యాయపదవినంది నలువది మూడేండ్లుపనిచేసి కాలక్రమమున వేతన
ము నలువదిరూప్యంబులుగాఁగ దమకాలము నధ్యాపనమునందును
గ్రంథరచనయందును జపతపములందును బుచ్చుచు సుఖముగా వెళ్లిం
చి, క్రీ. శ. 1900 సంవత్సరమునకు సరియైన శార్వరి సంవత్సర శ్రావ
ణ బ॥ పాడ్యమియందు లోకాంతరగతులైరి. ఈ పాఠశాలయందు
వీరున్నంతకాలము దొరలందరు వీరినతిగౌరవముగనే చూచుచువ
చ్చిరి. మిషనరీలలో స్వమతస్థాపనోద్యోగమేగాని పరమతదూషణా
చింతయంతగాలేని యాకాలమున నేమతస్థులా మతధర్మములను పట్టు
దలతో ననుసరించుటయంత యసూయాజనకమయ్యెడిదికాదు. కావున
దొరలైనను వీరితోమాట్లాడవలసినప్పుడు కొంతదూరముగనేయుండి
మాట్లాడుచు శాస్త్రులవారి నైష్ఠికతకును, వారిమతాచారాను సరణ
మునకును గొంతగౌరవమును జూపుచుండెడివారు. ఈరామచంద్రకవి
యువారియెడ నతిగౌరవముఁ గలవాఁడై యుండియు తనస్వాతంత్ర్యము
నకును నైష్ఠికత్వమునకు నెట్టిలోపంబును సహింపక స్వధర్మాచరణ

మునఁ బ్రమత్తుఁడై యుండెడివాఁడు. కళాశాలాధ్యక్షులగు దొరగారొక శ్లోకమును రివరెండు మంచాలరత్నంగారి చేతికిచ్చి దీనికర్థము కనుఁగొని రమ్మని రామచంద్రకవి యొద్దకుఁ బంపిరట. దానికీయన తగు నట్లర్థముఁ జెప్పియంపఁగా నాదొరగారు తమకభిమానపాత్రుఁడగు మఱియొకరు చెప్పిన యర్థముం జెప్పి యిట్లు చెప్పఁగూడదాయని మరలఁ గనుఁగొని రమ్మనెనట. కాని యాయన యర్థంబచ్చట పొసఁగదని చెప్పి పంపఁగా నాదొరగారికి కొంచెము కోపము వచ్చి వారు స్వయముగా నడుగవలయునని వచ్చియడుగగా "తప్పు తప్పేగాని మీరు వచ్చియడిగినంత మాత్రాన నది సాధువగునా" యని బదులు చెప్పెనట. అంతదొరగారు తాము చెప్పిన యర్థమును తిరస్కరించి తమ్ముగూడ ధిక్కరించెనని దురభిప్రాయమునుపడి కళాశాలనుండి తొలఁగింపవలెనని ప్రయత్నింప నచ్చటి స్నేహితులీయన పాండిత్యంబగాధంబనియు శాస్త్రమున నంతస్వాతంత్ర్యము గలిగియుంటచే నంతనిరూఢిగా జెప్పెనుగాని మిమ్ముధిక్కరించుబుద్ధి లేదనియు నట్టిపండితుఁడు దొరకుట దుర్లభమనియుఁ జెప్ప నాదొరగారు శాంతిఁజెందిరట.

ఈయన యశోలుబ్ధుఁడును ధనకాంక్షియు గాకుండుటచే దన పాండిత్యమును జాటుకొనకుండినను ఈయన శిష్యులగు కళాశాలావిద్యార్థులకీయనయందలి గౌరవమువలన నీయనఖ్యాతి యచ్చటచ్చట కొంత వ్యాపించినది. ఒకప్పుడు మన దేశమందు సుప్రసిద్ధకవులగు మాడభూషి వేంకటాచార్యులవారు రామచంద్రకవినిగూర్చి చాల వినియుండియు కాలేజీలోనపుడు విద్యార్థులైన కొందఱి చేతికిఁగొన్ని సమస్యలను

శ్లో॥ చింతకాయకలేకాయ బీరకాయతమారికే
ఉచ్ఛింతకాయవార్తాకయ సాధకాయ తమాంజలిం॥

అనశ్లోకమునిచ్చి రామచంద్ర కవినుద్దేశించి పండితుఁడవై ననుండిననర్థము వ్రాయించుకొనిరమ్మని యీయగా వానిఁబూర్తిఁజేసి యర్థముల ననేకరీతుల వ్రాసియిచ్చి తానుతిరిగి



శ్లో॥ కమలసమ(శ)యానః పాద్విరాడాశయాన
స్స్వభరణవశయానః ప్రోఝితోసంశయానః
వరమధికశయానః క్షుత్రపాశాశయానో
వ్యధిజలధిశయానః పాతుపక్షీశయానః॥

యనువారి పూర్వుల శ్లోకమును

శ్లో॥ బర్హిశ్శ్వావిత్తనూరుటక్కలయ పృథుగణంచాధ్వరేదైవమేతి
క్షిప్రేతి-కీదృక్స్వవర్ణం నవహతి చహితః కోద్రిబింబంచకీదృక్
కింసాధుస్సత్పిపాసుం వదతిహలిన మాకారయాన్యోనతంకిం
లాంతంకింవక్తిమత్స్యం పదమవతుసతత్ప్రశ్నకార్యాభిధోనః॥

అను శ్లోకమునిచ్చి వీనికరము నిమ్మని యా విద్యార్థుల చేతనే పంపగా వానికి బదులురాలేదట. పాఠశాలయందుపసుమర్తి ఉమా మహేశ్వరశాస్త్రిగారప్పుడప్పుడు కఠినములగు సమస్యలనిచ్చి ఈయన పూర్తిజేయమిగుల సంతసించుచు నెవరైననట్టికఠిన శ్లోకముల గాని సమస్యలగాని తెచ్చినను పొట్టిశాస్త్రుల నడుగుమని పంపుచుండెడివారట. బ్రహ్మశ్రీశిష్టుకృష్ణమూర్తిగారికి వీరియందుగల యాదరమిది వఱకే పేర్కొనియున్నాము. ఈయనకు నాయన యందుగల భక్తి యునీయాన గ్రంథముల వ్యక్తమగుచున్నది. శృంగారసుధార్ణవమను భాణమున నీకృష్ణమూర్తి కవినిగూర్చి యిట్లు చెప్పియున్నాడు.

శ్లో॥ యేనస్స్వైరమకారిసారశరణం వేదాననం శక్రవై
రూప్యాదాత్మసరస్వతీ స్వజనితాం నీతాపరం ప్రాణితా
సత్కాణాదకలా భవత్కృతపరిష్వంగేవగాంధర్వికా
మీమాంసాసరణీపదానిమృదితాన్యశ్రాంతమశ్రాంతితః॥

శ్లో॥ తాదృక్శిష్టకులప్రకాశనకరశ్శ్రీసక్తినిత్యోత్సవః
స్వచ్ఛందంవసుదేవపోషణమనాశ్చంచత్కలాభావుకః
దృప్యత్పూర్వబుధప్రధాహృతిలసత్సౌదర్శనశ్రీకర
శ్రీకృష్ణస్సుమనశ్శిరోమణిరిరాకామి ప్రసూనుఃపరం॥

శ్లో॥ యద్వాగ్గుంభాశ్శుంభదుర్భ జగవరి బృంధాక్షీణసంక్షీబభావో
తృష్ణప్రత్యర్థి దృప్యత్కనకధరలసచ్ఛృంగ భంగాధి సృష్టా
ప్రోద్యజ్ఝంఝానభస్వద్ర మణగణలసద్గుంభశుంభత్సగర్భాః
ప్రావృట్ ధారాధరాఘోద్భవదశనిసమార్భట్యధిక్షేపదక్షాః॥

శ్లో॥ శరద్వ్యక్షకోకాంభోజని వనవిహారోన్మదసిత
చ్ఛత్రక్రేంకారారావం కృతిహృతి కలాకల్పకలనాః
ప్రియాలోకోల్లాసిస్మరతథభికాకర్ణనమనః
కురంగాక్షీపాదాంగదమధురశింజాసహచరాః॥

శ్లో॥ తదనుగ్రహవారితాజ్ఞతాం జనితాంచత్కవితావతారకః
కృతిగుంభిత మాధురీభరో వరకౌండిన్యశుభాన్వయోదయః॥

శ్రీ క్రిష్ణమూర్తిగారి కీయనకవిత్వము వినుటయన్న పరమసంతోషముగావున నీయన స్వస్థలమగు గోదావరిమండలమునకు శెలవులలోఁబోయినప్పుడెల్లఁ దచ్ఛ్లోకముల వినిపించుచుండెడివారట. మఱియు క్రిష్ణమూర్తిగారీయనను పల్లెటూరియందు జరుగుచుండెడి దొమ్మరాటలు కోడిపందెములు మొదలగుగ్రామవినోదముల జూచుటకుఁదోడ్కొనిపోయి తిరిగివచ్చునపుడా యాటలను వర్ణింపుమని చెప్పి తామునుగొన్ని పద్యములఁ జెప్పుచుండెడివారట. ఇట్టి వినోదములఁజూచుట వలన నీచజాతులు వాడుచుండెడి కొన్ని పారిభాషికపదము లలవడునని చెప్పి యట్టివానిజూచుట యందుత్సాహము గల్గించెడివారఁట.

నోబిల్ పాఠశాలలోఁ బ్రవేశించినది మొదలు నిత్యకృత్యానుష్ఠానము నధ్యాపనము కవితావ్యాసంగము గ్రంథరచనము తప్పనింకొక్కజోక్యము వీరికి లేకుండె. ఈయన గ్రంథములు వ్రాయునప్పుడొక్కరీతిని వ్రాసికొని వెళ్లుటయేగాని తిరిగిసరిచూచుకొనుటగాని వ్రాసికొట్టివేసి మరల వ్రాయుటగాని యెచ్చటనుగన్పట్టదు. ఆకవితాప్రవాహమొక్కరీతిగానే యప్రతిహతంబుగ ప్రసరించెడిది ఈయనకుమంత్రశాస్త్రమునగల పరిచయమీయన 12 వయేటనే యుపదేశము పొందు



టయు, నీయన రచియించిన దేవీవిజయము, కుమారోదయము, మొదలగు వానివలననే ప్రకటితమగుచున్నది.

ఈయనరచించినవిసుమారు ముప్పదిగ్రంథములవరకునుండును. ఆంధ్రమున నీయనరచియించిన గ్రంథములు దేశమున నంతగా బ్రకటితములు గాకపోయినను ఆంధ్రవాఙ్మయమున నూతనశాఖలకు దారిఁదీసిన వాడీయనయేయని చాటుచున్నవి. ఆంధ్రకవులు నాటకాది రూపక రచనకుండిగని కాలమున నీయన

"బహులగుణంబుల ననేకలేఖినీవిలేఖిత హృద్యపద్యావళీ సంతోషిత పరజనస్వాంతుఁడగు నతండొక్కనాఁడు నానావిధప్రబంధ ప్రకారంబులు గోష్ఠీవశంబునం దలపోయుచు దృశ్యశ్రవ్యకథామయంబులగు కావ్యంబుల, శ్రవ్యమాత్రంబుల మహాకవులచేఁ ద్రిలింగభాషయందు గ్రథితంబులుగఁ దృశ్యంబులగునవి తాదృశంబులుగామికిం జింతించి తద్గ్రథననిషేధకారణంబు, గానక ... ... ... ... ... సంచితోత్సాహుండై సంస్కృతాంధ్ర మిశ్రంబుగాఁ బ్రాచీనానుశాసనోక్త లక్షణలక్షితంబగు నటుల సకలసరసపదార్థఖనీ వాటియగు ."మంజరీమధుకరీయం బనునాటిక" రచించియుండెను. ఈ నాటిక 1860 సం॥ ప్రాంతమున రచింపబడియుండును. ఈ మంజరీమధుకరీయ మందలి కథ యపూర్వము. స్వకపోలకల్పితము. పురాణాదులనుండి సంగ్రహించినదికాదు. ఇది ప్రస్తుతపు రంగవ్యవస్థలనుబట్టి ప్రదర్శించుట కనుకూలము కాకున్నను ప్రాచీన సంప్రదాయముల ననుసరించి స్వపాండిత్య ప్రకర్షయే ముఖ్యముగా కవులాదఱుతలఁచుచుండెడి కాలమున వ్రాసిన గ్రంథముగుటఁ బ్రదర్శన యోగ్యములగు నాధునిక నాటకములకంటె కించిద్భిన్నమై యుండినను ఆంధ్రవాఙ్మయమున నాటకశాఖలోని తొలి గ్రంథములలో నొక్కటియై యుండుననుటకు సంశయముండదు. ఇంతేగాక శాకుంతలము, వేణిసంహారము, ముద్రారాక్షసము మొదలగు నాటకముల నింతకుఁబూర్వమే యాంధ్రీకరించి యీ యుద్యమమునకు దారి

తీసినవారైరి. మఱియు నాంధ్రసారస్వతమున ప్రప్రథమమున గద్య రచనకుం గడగినవారిలో నీయనయు నొకఁడని చెప్పనగును. నయ ప్రదీపమను విగ్రహము మొదలగునవి యొక్కకచో దీర్ఘ సమాసజటిలంబులై యుండినను, పరశురామ విజయాదులు మిగుల సులభశైలిని వ్రాయబడుటఁ జూడనిప్పటికే గద్యశైలియందలి రుచి (taste) మారుచుండెననియు నా మార్పున కనుగుణ్యముగనే యీయన ప్రయత్నములుసల్పుచుండుటవలన నూతనయుగ ప్రభావమీయనకప్పుడే కొంత సోకెననియుఁనట్టి నూతనయుగ చిహ్నములే యీయన కవితయందుపొడసూపెననియు మనమూహింపవచ్చును. గీర్వాణమున వీరురచించిన గ్రంథములలో

1. కుమారోదయమను చంపూ కావ్యమిరువదియే డుల్లాసములుగలిగిన యొకయుద్గ్రంథము
2. శృంగార సుధార్ణవమను భాణము.
3. రామచంద్రవిజయమను వ్యాయోగము.
4. ధీసౌధము. ఇది వ్యాకరణము నూతనముగ నభ్యసించువారి కనుకూలముగ సులభరీతిని వ్రాయంబడినది.
5. శృంగారమంజరి.
6. కమనానందమను భాణము.
7. పుమర్థసేవధి కావ్యము.
8. దేవీవిజయమనుచంపువు.
9. మృత్యుంజయవిజయము.
10. ఉత్తరరామాయణము.
11. త్రిపురాసురవిజయమనుడిమ
12. రాజవంశము. [ము
13. మంజరీసౌరభము.
14. భాస్కరరాయప్రణీత దేవీసహస్రనామము లకుభాష్యార్థ సంగ్రహము
15. దేవీస్తవము
15. శ్రీకృష్ణోదయకావ్యం
17. కందర్పదర్పం.
18. వైరాగ్యవర్ధని.
19. ఉపమావళి.
20. కాళిదాసకృత మేఘసందేశోత్తర కథాభాగరూపము "ఘనవృత్తము"



21. కాళిదాసవిరచిత కవికంఠపాశాఖ్య ప్రబంధమునకు వాఖ్య
22. అమృతానంద యోగవిరచిత సర్వాలంకార సంగ్రహమునకు వ్యాఖ్య.

ఆంధ్రీకృతగ్రంథములు.

23. భాస్కరకవి ప్రణీత మగు ఉన్మత్తరాఘవమునకుఁదెనుఁగు
24. ముద్రారాక్షసము.
25. శాంకుతలము.
26. వేణీసంహారము.
27. ఉత్తరరామచరితము.
28. రథాంగదూతము.
29. విష్ణుశర్మ విరచితవిగ్రహము నయప్రదీపమను పేరుగలది.

ఆంధ్రమున స్వయముగా రచించిన గ్రంథములు.

30. మంజరీమధుకరీయ మను నాటిక. కథస్వకపోల కల్పితము.
31. పరశురామ విజయము—గద్యకావ్యము.

---

రామచంద్రకవికి ముగ్గురు పుత్రులు, ఇద్దరు పుత్రికలు, లక్ష్మీమనోహరము, రామకృష్ణశాస్త్రి, దుర్గా నాగేశ్వరశాస్త్రి అను వారలు. లక్ష్మీమనోహరము కొంతవరకు సంస్కృతవిద్యనేర్చి ఆంగ్ల విద్య నభ్యసించి మెట్రిక్యులేషన్ ప్యాసయి రెవిన్యూ డిపార్టుమెంటులో ప్రభుత్వోగముచేసిరి. రెండవపుత్రుడు రామకృష్ణశాస్త్రి కళాశాలలో నాంగ్లవిద్య నభ్యసించి అచిరకాలముననే అమోఘమైన సంస్కృత భాషాపాండిత్యమునుఁకూడ నలవరచికొని, ఆ విద్య తగిన వికాసముఁనందక పూర్వమే దురదృష్టవశమున నల్పవయస్సుననే లోకాంతరగతుడయ్యెను. ఆయన కుమాళ్లిరువురు ప్రభుత్వోగములను జేసి విశ్రామమును గొనుచుండిరి. మూడవ కుమారుడు

దుర్గా నాగేశ్వరశాస్త్రి). ఈయన తండ్రిని మించినకొడుకు, సహజ పాండితీధురీణుడు. కాలేజీలో మెట్రిక్యులేషన్ చదువుచునే తండ్రి యొద్ద సంస్కృత విద్య నభ్యసించినాడు. అనారోగ్యముచే తండ్రి కళాశాలకు బోవనశక్తుడైనపుడు-వెంటనే మెట్రిక్యులేషన్ పరీక్షకు బోవుట మానివేసి, తండ్రి స్థానమున కళాశాలలో పండితుడుగ బ్రవేశించి కాలేజీవిద్యార్థులకుగూడ పాఠములు చెప్ప మొదలిడితండ్రి గారి పనిని అతిసమర్థతతో నిర్వహించిన సాహసికుడు. అచిరకాలముననే సర్వశాస్త్ర పారంగతుడయ్యెను. యోగాభ్యాసరతుడు. నిరాడంబరజీవి. పరమార్థవిషయైక దృష్టికలవాడు. స్థితప్రజ్ఞుడు, అంతర్ముఖుడు. తండ్రివలెనే ఆయన యనంతరము చిరకాలము-సుమారు 33 సంవత్సరములు బందరు నోబిల్‌కళాశాలా పండితుడుగానుండి, ఆత్మగౌరవముతో క్రిస్టియన్ దొరల యాదరమును బడసి తుదకు వారివలన నుపకార వేతనమునుగూడ పొందియున్నాడు. ఇట్లు గోదావతీరమునందలి కోరాడవంశీయులు బందరు కాపురస్థులైము పాతికశతాబ్దముల విద్యాసంస్థను గొలిచినవారైనారు. రామచంద్ర కవిగారికి బందగుడుప్పెన అనుభవముకూడ కలదు. నాగేశ్వరశాస్త్రిగారెల్లపుడు యోగాభ్యాసమునకు వెచ్చింపని కాలమంతయు కళాశాలలోనెగాక ఇంటి యొద్దను ఎడతెరపిలేక యనేకులగు శిష్యులకు తర్క-వ్యాకరణ వేదాంత సాహిత్యాది శాస్త్రముల నత్యాదరముతో బోధించుచు ఆడంబరములేని యంతర్దృష్టితో సుఖసరళ జీవితమును గడపుచు యోగసిద్ధిని బొందినవాడయ్యెను. ఆ కాలములో కళాశాల ప్రిన్సిపాలులగు క్లార్కు, పెన్ను మొదలగుదొరలేకాక, కళాశాల పండితులు పట్టణములోని పలువురు పెద్ద ఉద్యోగస్థులు మొదలగు వారు కూడ వీరియొద్ద నేదో ఒకపాఠము చదువుచు నుండెడివారు. అతరిములోని బందరునోబిల్ కళాశాల విద్యార్థులనేకులు వీరి శిష్యులై వీరియందు భక్తితాత్పర్యములు గలిగియుండెడివారు. నిశితశాస్త్రదృష్టియేగాని కవనదృష్టి వీరికంతగా లేకున్నను, తండ్రిగారి గ్రంథములు లోకమున బ్రకటితములైన జాలదా-ఇంకను వ్రాయుటయెందులకని చెప్పుచు



గ్రంథరచనా ప్రయత్నమునుండి విరమించుకొని, తండ్రిగారి గ్రంథములను బ్రకటింపదగు ప్రయత్నముచేసి ధన్యులైనారు. శృంగార సుధార్ణవభాణము, ఘనవృత్తకావ్యము, కుమారోదయచంపువు, దేవీ విజయము, ఉపమావళి అను సంస్కృతకావ్యములను, మంజరీ మధుకరీయమను-తెలుగునాటిక, నయప్రదీపము, బరశురామవిజయము, రథాంగదూతము అను తెలుగుగద్యకావ్యములను తొలుత నీయనయే ప్రకటించినారు. ఈయనకు సంతతిలేకుండుటకూడ యీాయన సాధనకు దోడ్పాటయినట్లున్నది.

రామచంద్రకవి జ్యేష్ఠపుత్రుడగు లక్ష్మి మనోహరంగారికి ఇద్దరుకుమాళ్లు. రామకృష్ణయ్య-శేషవధానులు అనువారు. రెండవ కుమారుడు కొంత ఆంగ్ల విద్య నభ్యసించి బందరులో ప్రభుత్వోద్యోగమున నున్నారు, ఆయన కుమాళ్లిరువురు వర్థమానులు.

లక్ష్మి మనోహరంగారి పెద్దకుమారుడు శ్రీరామకృష్ణయ్య ఎం. ఏ. ఇప్పటికి షష్టివత్సర జీవితమును పూర్తిచేసినవాడు.

"ప్రాక్ప్రతీచీ విజ్ఞానాలను, సాహితీసంప్రదాయాలనుజీర్ణించుకొని తెలుగుభాషా సాహిత్యములలో స్వతంత్ర విమర్శన దృష్టిని ప్రవేశపెట్టిన వారిలో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారొకరు"—అభ్యుదయ, (ఏప్రిల్-1947).

శ్రీ రామకృష్ణయ్యగారి జననము 1891. సం. అక్టోబరు 2, ఖరనామ సంవత్సర ఆశ్వయుజ శుద్ధపాడ్యమి. చిత్తా నక్షత్రము. తల్లిదండ్రులకు జిరకాలమునకు పుట్టిన కొడుకు, తల్లిసీతమ్మ ఓరిమి, భక్తి, పవిత్రత మొదలగు గుణముల సీతమ్మయే, పదితరముల నుండి పండిత కుటుంబము, తాతగారు గోదావరి జిల్లానుండి వచ్చి బందరుచేరి యచ్చట గౌరవాదరములతో నిరుగు పొరుగువారి ప్రోత్సాహముచే కట్టినయిల్లు, తండ్రితాతల యనూచాన శిష్ట సంప్రదాయ గౌరవములతో తలుతూగుచుండెడిది. వచ్చేపోయే బంధువులు పెద్దలు పండితులు శిష్యులు. ఎడవల్లి రామకృష్ణయ్యగారని ఒకజ్యోతి

షికుడు నిష్ఠాపరుడు పండితుడు జాతకముచూచి ఈ పిల్లవాడు చాల అదృష్టవంతుడు ముద్రణాధికారియగునని జోస్యముచెప్పెనట. దానికి తల్లిదండ్రులు "భాగ్యవంతం ప్రసూయేథాః మాశూరం మాచ పండితం" అన్న వాక్యమును స్మరించుకొని అదృష్టవంతుడైన చాలునని సంతసించెడివారట. ఈయన జీవితముకూడ తదను గుణముగ సదృష్టము పై నాధారపడియే నడచినట్లగపడుచున్నది.

బాల్యమున రామచంద్రకవి గాంభీర్యగౌరవములు, ఆయన గ్రంథరచనావ్యగ్రత, ఆయనపాండిత్యప్రభావాదులయెడ చుట్టుపట్టుల వారికిగల గౌరవాభిమానములను కొంత గుర్తించినాడు. వీధిబడిలో చదువు కొంతకాలము-బండకొయ్యలు-కోదండములు-శిక్షణాపద్ధతుల కాలమది వీధిబడులలో. వానికీత డెప్పుడు గురికాలేదుగాని తోడి బాలుర యవస్థలకు నిర్విణ్ణుడై దుఃఖించుచుండెడివాడు. పిదప రామన్నపేటలోనా దెల్లపురుషోత్తం (కవి)గారి ప్రైమరీ పాఠశాలలో. ఆ రోజులలో ప్రాథమిక విద్యాబోధకు శ్రీ పురుషోత్తం పంతులు గారిది పెట్టినదిపేరు. పిల్లలకీయనయెడల భయభక్తులు ఆదరాభిమానములు, కూడ హెచ్చుగానుండెడివట. తరువాత హిందూ హైస్కూలులో మూడవఫారమువరకు, నాల్గవఫారంనుండి నోబిల్ కాలేజీలో బి. యే వరకు చదువు. ఇంకా అప్పటికి పాతచేతులు బ్రహ్మయ్య లింగంగారు తెలుగుపండితులు కుంటిర ంగాచార్యులు గారు సంస్కృతపండితులుగానున్నారట. వారిచమత్కార భాషణములు పిల్లలవేళాకోళాలు, తెలుగుక్లాసులఅల్లరులు విశేషముగానుండెడివట.కుంభకోణం క్రిష్ణమాచార్యులుగారి బెత్తపుదెబ్బల హెడ్మాస్టరీ హయాంరోజులవి. ఆయనంటేచిన్న పెద్దలందరికీకూడాహడలట. ఆయన ఆంగ్లపాండిత్యము బోధనాశక్తియు నట్టివే. కోకా పిల్లారిశెట్టిపుట్ బాల్ టెన్నిసు పందెపుటుత్సాహపురోజులవి. వందేమాతరంఉద్యమం,బిపిన్ చంద్రపాల్ ఉపన్యాసాలు, కొత్తా శ్రీరామశాస్త్రిలుగారి మచ్చుల సావడి ఉపన్యాసాలు, విద్యార్థులను దిగ్భ్రమచెందించిన కాలమది.



వివేకానంద, బోసు, టాకూరుల మూలముగా హైందవ ప్రతిభ ప్రపంచవ్యాప్తిగాంచిన కాలము గాంధి ఆఫ్రికా సత్యాగ్రహము హిందూ హైస్కూలు ఇసుకబయళ్లలో మీటింగులు - సహాధ్యాయి శ్రీమత్తిరుముల గుదిమెళ్ల వరదాచార్యులు - ఒక్కసారి 500 రూ. విరాళం గాంధినిధికి ఇచ్చుట. హిందూ బాలభారత సమాజంలో మతోపన్యాసాలు - జాతీయ కళాశాల దీపావళి వసూళ్లు, స్వాములవార్ల భిక్షలు, దేవాలయాల్లో వేదాంతోపన్యాసాలు, కళాశాలలో క్రైస్తవ బోధకులగు - ప్రిన్సిపాలుల - దైనిక సెర్మన్లు, చర్చలు, కొందఱువిద్యార్థుల క్రైస్తవమత స్వీకరణయత్నములు,వాని ప్రతిఘటన యత్నములు, శివగంగ మహిషాసుర మర్దని ఉత్సవములు ఏనుగంబారీలు, తాలింఖానాలు, దీపావళి టంకం శేరుతోటాల లడాయీలు, అతిచమత్కారంగా జరిగినదట ఆ కాలంలో విద్యార్థిదశ. మెట్రికులేషన్ ప్యాసగుట గోదావరిజిల్లా ముంగండ గ్రామవాసులు ఖండవిల్లి రామమూర్తిశాస్త్రిగారి ద్వితీయపుత్రిక అన్నపూర్ణాంబను వివాహమగుట సమకాలికములు.

కాలేజీలోనికి వచ్చేసరికి క్రొత్తగావచ్చినది ఇంటర్మీడియేటు పద్ధతి. ఎఫ్. ఏలో నియతమైయుండిన లెక్కలబాధ తప్పించుకొని తెలుగు సంస్కృతము హిస్టరీలను ఆప్షనలుగా చదువు నవకాశమేర్పడినది. కాలేజీలోనే తెలుగు పండితులుగానున్న పినతండ్రిగారి ప్రోత్సాహంతో సంస్కృతాంధ్రములే అభిమాన శాఖగా బి, ఏ అయినది. అక్కడ కాలేజీచదువు ఇంటియొద్ద పినతండ్రిగారియొద్ద శాస్త్రకావ్య పాఠాలు చదివేవారితోపాటు సంస్కృత విద్యాభ్యాసం. వారిఇల్లుకూడా ఎప్పుడూ ఒక పాఠశాలగానే ఉండేది. ప్రొద్దున్నే స్నానం-ఏ రెండుగంటలో జపం (యోగాభ్యాసం) అయినదిమొదలు భోజనంచేసేటప్పుడు, స్కూలుకు వెళ్లేటప్పుడుకూడా మధ్యాహ్నం విరామపు గంటలోనూ, మరల సాయంత్రం ఇంటికివచ్చేటప్పుడు -రాత్రి 10 గంటలవరకు కూడా ఎవరో ఒకరు ఏదో ఒకపాఠం చదువుచునే యుండేవారట పినతండ్రినాగేశ్వరశాస్త్రిలుగారియొద్ద.

1915లో బియే. పరీక్షఅయినతోడనే అప్పుడువిజయనగరంలో సంస్కృత కళాశాల వైస్‌ప్రిన్సిపాలుగానుండిన శ్రీ వరదాచార్యులు గారి ప్రేరణమున-ఆర్ట్సుకాలేజీ ప్రిన్సిపాలుగారు శ్రీ రా మా ను జా చార్యులు (రామావతారం) గారి పిలుపుతో- విజయనగరం ఇంగ్లీషు కలాశాలలో సంస్కృతాంధ్రోపన్యాస కోద్యోగము సులభముగనే లభించినది. నోబిల్ హైస్కూలులో ఏ రెండవ ఫారం టీచరుగనో కుదురుకొని యుండకుండా కాలేజీలో ఉద్యోగం లభించడ మదృష్ట మనే అనుకున్నారట. రవిన్యూచదివి యే డిప్టీతాసిల్‌దారుగానో వెళ్ళవలసినదన్న తండ్రిగారి సలహాకూడా దీనిముందర త్రోసి రాజైనది. అప్పటికి విజయనగరం కళాశాలలో రెండుభాషలలో బి, యే ప్యాసైనవారు కావలసి రావడం, ఇతరుల పోటీ లేకపోవడం ఈయన అదృష్టమే. ఆ స్థానములోనుండి బియే (Part III) విద్యార్థులకు సంస్కృతభాషాశాస్త్రము, ద్రావిడభాషా వ్యాకరణము బోధింపవలసి వచ్చుటవల్ల భాషాశాస్త్రము విషయమున నీయన కొంత శ్రద్ధతో పనిచేయవలసిన యావశ్యకత యేర్పడినది. ద్రావిడ భాషాతత్వ పరిశీలన సందర్భమున నాకళాశాలలో నాకాలమున నాంగ్లభాషలో ప్రధానోపన్యాసకులుగనున్న శ్రీ ఉల్లాల్ సుబ్బరాయభట్టుగారితోడి సన్నిహితపరిచయము, తరచుగా వారితో ద్రావిడభాషాతత్త్వమును గూర్చి, కన్నడతుళు భాషలనుగూర్చి సలుపుచు వచ్చినచర్చలు, వీరి ద్రావిడభాషా శాస్త్రాభిమానమును, తత్తత్వ పరిశీలనా కుతూహలమును విశేషముగా పెంపొందించినవట. ఆ కాలమున మహారాజా వారికాలేజీ మేగ జైనులో ద్రావిడభాషా పదములనుగూర్చి వర్ణోత్పత్తి క్రమమును గూర్చి యీయనవ్రాసిన వ్యాసములకు శ్రీ భట్టుగారి ప్రోత్సాహమే కారణమట. అచ్చట తెలుగుపండితులుగానున్న శ్రీ అడిదము రామారావుగారు, వి. గోవిందరాజాచారిగారు మొదలగు వారి ప్రోత్సాహమునకొన్ని సాహిత్య వ్యాసములను విమర్శనలను ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక భారతి మొదలగువానికి వ్రాయ మొదలిడిరి. 1921 లో ఎం. ఏ. పరీక్షలో రెండుభాషలభిమాన



'గముగా కృతార్థులైరి. 1924 లో ప్రిన్సిపాల్ శ్రీ రామానుజా చార్యుల వారి ప్రోద్బలమున మద్రాసులో జరిగిన అఖిలభారతప్రాచ్య మహాసభకు సభ్యులుగాబోయిరి. అప్పటినుండియు దరచుగా వీరీ ప్రాచ్యమహాసభలకు బోవుచుండిరి. 1947. సం. దర్భంగాలో జరిగిన అఖిలభారత ప్రాచ్యమహాసభ పదునాలవ సమావేశమునందలి ద్రావిడ విజ్ఞాన శాఖకధ్యక్షత వహించిరి. ఇంతలో మద్రాసు యూనివర్సిటీలో ప్రాచ్యపరిశోధనశాఖ యొకటి ప్రారంభింపబడినది. శ్రీరఘుపతి వెంకటరత్నం నాయుడుగారప్పుడు వైస్‌ఛాన్సలరు. ద్రావిడభాషల విషయమున కొంత అనుభవము పరిశోధనదృష్టి కల వారిని తీసుకొనవలెనని ఆయన అభిప్రాయం. గిడుగు రామమూర్తి పంతులుగారు వృద్ధులుగాబోలు. చి. నారాయణ రావుగారు గవర్నమెంటు కాలేజీలో కుదురుకొనియున్నారు. అయినా 150 రూ. లకురారు. బి, యే. క్లాసులో తెలుగు (Part III) లో బోధించు కాలేజీ ఒక్క విజయనగరం కాలేజీయే కాబోలు. కళాశాలాధికారులు తగిన శలవొసంగుటచేత, 1927 లో మద్రాసు యూనివర్సిటీలో 150 రూ. మీద రీడరనుపేరుతోవచ్చి తరువాత కొంతకాలమునకు సీనియర్ లెక్చరర్ అనేస్థానంలో స్థిరపడినారు. తరువాత 1946 లో రిటైరై, 1947-49 లలో మరల నాస్థానముననే నియుక్తులై కొంత కాలము పనిచేసి సుమారు ఇరువది ఇరువది రెండు సంవత్సరముల కాలము ఆంధ్రభాషా వాఙ్మయములను గూర్చిన పరిశోధనలో యథాశక్తి పనిచేసి ఆంధ్రభాషా వాఙ్మయ పరిశోధనల విషయమున నూతన దృక్పథమును నెలకొల్పుటకుప్రయత్నము చేసినారు.

విజయనగరం మహారాజావారి కళాశాలనువదలి మద్రాసు యూనివర్సిటీలోని ప్రాచ్యపరిశోధన సంస్థలో జేరినప్పటినుండియు, నసిధారావ్రతమేయనదగిన పరిశోధన విషయమున వ్యాపృతులై యుండిరి. దక్షిణదేశభాషల విషయమైన పరిశోధన మింకను క్రొత్తమార్గమే యగుటచే, అక్కడ చేయదగిన పనులనుగూర్చి పలు

వురు పలువిధముల తలంపసాగిరి. నిశ్చితభావములు లేకుండెను. ఆ కారణముచే నచ్చటి పని కొంతకాలమసిధారావ్రతముగనే యుండెను. ఆంధ్రభాషా సాహిత్యముల పరిణామము నన్వేషించి, వాని ప్రత్యేక లక్షణములు, విశిష్టత ఎట్టివో వ్యక్తపరచుటయే ప్రాచ్య పరిశోధనశాఖలో జరుగవలసిన పనులలో ముఖ్యమైనదని ఆయన తలంచినాడు. ఇంతేగాక ఆంగ్లభాషా సాహిత్య పరిజ్ఞానమువలన మనము సంపాదించిన భాషాసాహిత్య విమర్శనపద్ధతులను మన భాషాసాహిత్యముల పరిణామముపట్ల సమన్వయించి వివరించుటయు నావశ్యకమేయని తలంచెను. కావుననే యాయన తొలి రిపోర్టులో నీ విషయములే యుద్ఘాటించబడినవి. ఆంధ్రభాషా పరిశీలనవిషయమునగాని సాహిత్యపరిశీలన విషయమునగాని తొలుత మూలాధారముగా గ్రహింపదగినది ఆంధ్రభారతమే యగుటచేత తత్పరిశీలనము తోడనే యా శాఖలోని పరిశోధన ప్రారంభింపబడుటయు జరిగినది. తత్ఫలితముగా ఆయన "ఆంధ్రభారత కవితా విమర్శనము"నే గ్రంథమును తొలుత ప్రచురించినారు. అందులో నీ తన లక్ష్యాలనుగురించి ఆయన విస్పష్టముగా చెప్పుకున్నాడు.

"ఆంధ్రభాషా వాఙ్మయముల చరితమును వాని సక్రమ పరిణామమును అన్వేషించి విమర్శించుటయే ప్రాచ్య పరిశోధనాలయామందలి ఆంధ్రశాఖ చేయదగినపని......భారతమే ఈ భాషలో మొదటి యుద్గ్రంథమగుటచే, తద్భాషా వాఙ్మయపరిణామమునకిది ఎంత వరకు తోడ్పడినదో తెలిసికొనవలసిన యావశ్యకతకలదు...భారత కవితకు తద్దేశకాల పరిస్థితులతో నెట్టి సంబంధముకలదో, అది ఆంధ్ర భాషా వాఙ్మయ పరిణామమునకెట్లు తోడ్పడినదో...విమర్శనలింకను బయలుదేరవలసియున్నవి. గీర్వాణసారస్వత మహావృక్ష శాఖకు గట్టిన అంటుగా బయలుదేరి విజృంభించిన అంధ్రసారస్వతమునందు ఆంధ్రజాతీయతాగుణ మెంతవరకున్నదో పరిశీలింపవలసియున్నది. ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును గుర్తించి, దాని కితరద్రావిడభాషల



తోను సంస్కృత ప్రాకృతములతోడనుగల సంబంధ బాంధవ్యములను నిర్ణయించి, తద్భాష చరిత్ర నన్వేషించుటయు నావశ్యకమే."

ఈ లక్ష్యముతోడనే ఆంధ్రభాష తత్వమును, సాహితీరీతుల పరిణామమును పరిశోధించి వివరించు యత్నమును సాగించినారు. ఆంధ్రభాషచరిత్రాన్వేషణకు ద్రావిడభాషాతత్వపరిశీలన ముఖ్యసాధనమని తలంచి, కాల్డ్వెల్ చూపిన పంథానేయనుసరించి, తెలుగుభాష పుట్టుపూర్వోత్తరములను కనుగొనుటకు ప్రయత్నించినారు. సంస్కృత ప్రాకృతములకంటె, తమిళ కన్నడాది దక్షిణదేశభాషలే ఎక్కువ సహాయకారులగునను నిశ్చయమునకువచ్చినారు. ఆ భావమును నిశ్చయమును బురస్కరించుకొనియే "Studies in Dravidian Philology" అనే పుస్తకమును తొలుత బ్రకటించినారు. సంస్కృతమే అన్నిభాషలకు జననియని తెలుగుసంస్కృత భవమేనని తలంచి సంపూర్ణముగ సంస్కృత వ్యాకరణపక్కినే తెలుగువ్యాకరణము రచించిన తెలుగుపండితుల దురభిప్రాయములను తొలగించి, తెలుగు వ్యాకరణ విశేషములనువానిని భాషాచారిత్రకపద్ధతిని సమన్వయించి చూపుటకు అనేక విమర్శక వ్యాసాలుగ్రంథాలు వ్రాసినారు. సంధి, భాషోత్పత్తి, వర్ణోత్పత్తిక్రమము, మొదలైన రచనలీదృష్టితో రచింపబడినవే. 1950 సంవత్సరమున మద్రాసు గవర్నమెంటువారు మద్రాసు తెలుగుభాషాసమితిమూలముగా వీరి భాషా పరిశోధనల విలువనంగీకరించి వీరు ప్రకటించిన భాషోత్పత్తిక్రమమునకు 500-రూప్యములు బహుమానము నిచ్చి సత్కరించినారు. పాఠశాలలలోను కళాశాలలలోను వ్యాకరణముబోధించు పండితులకు తెలుగువ్యాకరణ సూత్రబోధనము విషయమున చారిత్రక దృక్పథమేర్పడవలెనని యాయన యాశయము. భాషావిషయములోవలెనే సాహిత్యచ్ఛందోవిషయములగూడ, సంస్కృతమునుండివచ్చిచేరిన సంప్రదాయపక్కికి భిన్నమై, దక్షిణదేశీయభాషలకుసహజమైన సంప్రదాయపక్కియొకటికలదని, అదిసంస్కృత సంప్రదాయ ప్రాబల్యమువలన మాటుమణిగిపోయినదనీ, కావున నట్టిదేశీయ సంప్రదాయ సిద్ధమగు వాఙ్మయ

మును, పద్యములు, పాటలు, సంకీర్తనములు మొదలగువానిని పునరుద్ధరించి అందలి ఛందస్సాహిత్య భాషావిశేషములను ఇతరములగు దక్షిణదేశభాషలలోని వానితో బోల్చి పరిశీలించుట యావశ్యకమనియునాయనభావము. ఈ విషయమును ప్రతిపాదించుటకే యిటీవల నాయన దక్షిణదేశభాషలు - దేశి యను గ్రంథమును బ్రకటించిరి. తెనుగునందలి యుపజాతి చ్ఛందస్సును తమిళకన్నడ ఛందముతో బోల్చి చూచిన దేశీయద్రావిడ చ్ఛందోఫక్కి యొకటి బయలువడునని యాయన ఆశయము.

మనసాహిత్యవిమర్శనలో పాశ్చాత్యపద్ధతుల ననుసరించవలసిన యావశ్యకతను వ్యక్తము చేయుటకు "కాళిదాసుని కళాప్రతిభలు, సారస్వతవ్యాసములు, మొదలగు విమర్శవ్యాసములను ప్రకటించినారు. వీరివ్యాసములయు ప్రకటితగ్రంథములయు పట్టికతుది నీయబడియున్నది.

ఆంధ్రభాషాసాహిత్యతత్వములనుగూర్చి చేయవలసిన పని యింకెంతో ఉన్నది. కానిమనదేశంలో ఆపనులనుబూనుకొనినవారు చాల తక్కువగానున్నారు. మనభాషా తత్వాన్నిగూర్చి ఇతరదేశములలో జరుగుచున్న పనినికూడా మనదేశీయులు శ్రద్ధతో గమనింపవలసియున్నది. అనియీాయనచెప్పుచుందురు.

ప్రస్తుతము తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వరస్వామి కృపతో నాదరించుటచేతను, అచ్చటి మిత్రులు శ్రీ దేవస్థానము కమిషనర్ సి. అన్నారావు, బి. ఏ గారు, కమిటీ ప్రసిడెంటు శ్రీ కె. వెంకటస్వామి నాయుడుగారు, కళాశాల ప్రిన్సిపాలు-ప్రాచ్యపరిశోధన సంస్థకు డైరెక్టరుగానుండిన విజయనగర మిత్రులు శ్రీపరవస్తు రామానుజస్వామి. ఎం. ఏగారు. వీరియాదర ప్రోత్సాహములచేతను, శ్రీ వెంకటేశ్వరప్రాచ్యపరిశోధనాలయమున తెలుగురీడరుగా నియుక్తులైరి. ఇట్లాంధ్రభాషాసాహిత్యముల సేవతోపాటు శ్రీ వెంకటేశ్వరస్వామిసేవనుగూడ చేయునవకాశము లభించినందులకు ఆ దైవమును



దైవరూపముననున్న యధికారులను వీనికన్నిటికి మూలమగుచు నదృష్టరూపముననుండు నాదిశక్తిని కృతజ్ఞతాపూర్వకముగ స్మరించుచు నింకనెన్నడా దైవము జీవితపరమార్థమగు నాత్మానుభూతిని బడయగలుగుటకు దగుమార్గమును జూపునోయని ప్రాకులాడుచు తహతహపడుచున్నట్లు జీవితమును గడుపుచున్నారు. ఆపరదైవము వీరికి దీర్ఘాయురారోగ్యములనిచ్చి వారికి పరమాభీష్టమగు నాత్మానుభూతిని బ్రసాదించుగాక.

కోరాడ వంశీయులు.

ఖరనామ సం. ఆశ్వయుజశుద్ధ పాడ్యమి

మద్రాసు,<br>
2-10-51.